

# పైల్సు–ఫిస్టులా–ఫిషర్

డా॥ జి. సమరం, M.B.B.S

వాసవ్య నర్సింగ్ హోమ్, విజయవాడ – 520 006

ప్రచురణ నెం : 20

ప్రథమ ముద్రణ : ఆగస్టు 1993

ముద్రణ : డి.వి. ప్రింటర్ – విజయవాడ – 2

ప్రచురణ : నవభారత్ పబ్లికేషన్స్, విజయవాడ–4

I S B N 81–7260–026–7

వెల : రు. 12/–

సమర్పణ

## నవభారత్ బుక్ హౌస్

కార్ల్‌మార్క్స్ రోడ్ – విజయవాడ–2



# పైల్స్-ఫిస్టులా-ఫిషర్

డా॥ జి. సమరం, M.B.B.S

వాసవ్య నర్సింగ్ హోమ్, విజయవాడ – 520 006

ప్రచురణ నెం : 20

ప్రథమ ముద్రణ : ఆగస్టు 1993

ముద్రణ : డి.వి. ప్రింటర్ – విజయవాడ – 2

ప్రచురణ : నవభారత్ పబ్లికేషన్స్, విజయవాడ–4

I S B N 81–7260–026–7

వెల : రు. 12/-

సమర్పణ

నవభారత్ బుక్ హౌస్

కార్ల్‌మార్క్స్ రోడ్ – విజయవాడ–2

# పైల్స్, ఫిస్టులా, ఫిషర్


| | | |
|---|---|---|
| 1. | పైల్స్ అంటే ఏమిటి | 11 |
| 2. | మొలలు రకాలు | 14 |
| 3. | మొలలు - కారణాలు | 17 |
| 4. | లోపల మొలలు | 20 |
| 5. | మొలల మొదలు ఎక్కడ | 24 |
| 6. | మొలలు - బాధలు | 25 |
| 7. | మొలలు - కాంప్లికేషన్లు | 29 |
| 8. | మొలల దుష్పరిణామాలకి చికిత్స | 33 |
| 9. | బయట మొలలు | 35 |
| 10. | ఆపరేషన్ లేకుండా మొలలకి చికిత్స | 38 |
| 11. | మొలలకి ఆపరేషన్ | 41 |
| 12. | మొలలకి నాటు వైద్యం | 42 |
| 13. | మొలలు ఆపరేషను తరువాత తీసుకోవలసిన శ్రద్ధ | 44 |
| 14. | మొలలని భ్రమకలిగించే రెక్టల్ ప్రోలాప్స్ | 45 |
| 15. | ఫిషర్ | 47 |
| 16. | ఫిస్టులా | 51 |
| 17. | ఫిస్టులా ఎందుకు వస్తుంది | 52 |
| 18. | ఫిస్టులా రకాలు | 53 |
| 19. | ఫిస్టులా రావడానికి ఇతర కారణాలు | 55 |
| 20. | ఫిస్టులా చికిత్స | 56 |
| 21. | ఫిస్టులాకి దారితీసే పుండు | 57 |
| 22. | మలద్వారంలో హెర్పిస్ | 59 |
| 23. | మలద్వారంలో గడ్డలు | 60 |
| 24. | మలం ప్రేగుకి కేన్సరు | 62 |
| 25. | మలద్వారం దగ్గర కేన్సర్ | 65 |
| 26. | మలద్వారం దగ్గర దురద | 66 |
| 27. | అర్థం చేసుకుంటే అవస్థలు వుండవు | 68 |

# పైల్సు, ఫిషరు—ఫిస్టులా



మలద్వారం దగ్గర అంతమయ్యే మలం ప్రేగు, మలద్వారం దగ్గర కండరాలు



ప్రొక్టోస్కోప్‌తో చూసినపుడు లోపలి మొలలు కనబడే తీరు. ఇందులో బూర బుడగల్లా మూడు మొలలని చూడవచ్చు



మొలలని భ్రమ కలిగించే మలద్వారం దగ్గర ఏర్పడిన చీముగడ్డ










మొలలని ఆపరేషన్ చేసి తొలగించే విధానం



ఫిస్టులా పుండు ఒకవైపే కాకుండా మలద్వారానికి రెండువైపులా కూడా ఉండవచ్చు



మలద్వారం దగ్గర ఉండే మూడు మొలల పొజిషను. ఒక మొల
3 గంటల స్థానంలో, మరొకటి 7 గంటల స్థానంలో,
ఇంకొకటి 11 గంటల స్థానంలో ఉంటాయి.



రక్తం గడ్డ కట్టగా ఏర్పడిన థ్రాంబోస్డ్ పైల్స్



మొలలు ముడతపడి ఉబ్బిన ప్రొలాప్సలేటెడ్ మొలలు



మొలలవి భ్రమ కలిగించే కాండైలోమాటు



మలద్వారం లోపల ఏర్పడిన కేన్సర్ పుండు.
దీనివల్ల లోపల మొలలు ఉన్నట్లు రక్తస్రావం ఉంటుంది.



మలద్వారం చుట్టూ అనేకం
ఫిస్టులాలాగా
కనబడే కేన్సర్ వ్యాధి.



# పైల్సు - ఫిస్టులా - ఫిషర్

పైల్సు (మొలలు)

"పశువులకి పైల్సు ఉండవట, మనుష్యులకే నట" అన్నాడొకడు.

"అబ్బ అవెంత అదృష్టం చేసుకుని పుట్టాయో!" అని వాపోయాడు - పైల్సుతో బాధపడుతున్న పరంధామయ్య.

పైల్సు కొందరికి నిజంగానే బాధాకరంగా ఉంటాయి. కూర్చోలేరు...నించోలేరు.

దగ్గు అంటే క్షయవ్యాధే కానక్కరలేదు. మల ద్వారం దగ్గర బాధ అంటే పైల్సే కానక్కర లేదు. కాని అక్కడ అటువంటి బాధ ఏదొచ్చినా పైల్సు అనేయడం అలవాటు.

అది అలా ఉండగా వేడి అనీ వీక్‌నెస్ అనీ ఏవో ఒకటి తినడం తాగడం చేస్తారు. చిట్కా

వైద్యంతో తగ్గిపోవాలనుకుంటారు. పైల్సే అయితే అలా పోవు.

పైల్సు...ఫిస్టులా...ఫిషరు అన్నీ ఒకటేగా మాట్లాడేసుకుంటూ ఉంటారు. ఇవేకాదు అక్కడ మరికొన్ని మనిషిని ఇబ్బంది పెడతాయి.

ఆ ఇబ్బంది ఇంతా అంతా కాదు–అనుభవించిన వాడికే తెలుస్తుంది.

# 1. పైల్సు అంటే ఏమిటి ?

పైల్సు అన్నా మొలలు అన్నా ఒకటే. వైద్యభాషలో హెమరాయిడ్స్ అంటారు.

హెమరాయిడ్స్ అనడంలో అర్థం లేకపోలేదు. మొలలు అనేవి రక్తంతో ఉబ్బిపోయి మెలికలు తిరిగిపోయిన సిరలు ('చెడు' రక్తనాళాలు.)

మొలలు చూడటానికి బూరా బుడగల్లాగా ఉన్నా రక్తంతో ఉబ్బిపోయి మెలికలు తిరిగి ఉంటాయి.

కొందరికి కాళ్ళదగ్గర, పిక్కల మీద రక్తనాళాలు బాగా తేలి ఉంటాయి. రక్తంతో ఉబ్బి మెలికలు తిరిగి ఉంటాయి. వాటినే వేరికోజ్ వెయిన్స్ అంటారు. మొలలు (పైల్స్) కూడా మలద్వారంలోని వేరికోజ్ వెయిన్సే.

## మలద్వారం స్వరూపం

మలద్వారానే 'యానస్' అంటారు. మలం ప్రేగు (రెక్టమ్) యానస్ దగ్గర అంతం అవుతుంది. అక్కడ నుంచి యానస్ (మలద్వారం) మొదలవుతుంది. మలం ప్రేగు చివరి భాగమే మలద్వారంగా చెప్పుకోవచ్చు. మలద్వారం 4 సెం. మీ. పొడవు వుంటుంది.

## గడియారంలోని గంటలు స్థానంలో మొలలు

మలద్వారం దగ్గర రబ్బరు బ్యాండుల్లాగా గుండ్రంగా రెండు కండరాలు ఉంటాయి. మల విసర్జన సమయంలో ఇవి విచ్చుకుని మల విసర్జనకి అనుకూలిస్తే తక్కిన సమయంలో బిగుసుకుపోయి మలద్వారాన్ని మూసి ఉంచుతాయి.

మలద్వారం విచ్చుకున్నప్పుడు చూస్తే ముందర కాస్త నల్లగా తెల్లగా కనిపించినా లోపల ఎర్రగా ఉంటుంది. ఆ ఎర్రటి పొర ముడతలుగా ఉంటుంది. ఇంకాస్త పైకి చూస్తే ఆ పొర లేత గులాబీలా ఉంటుంది.

మలద్వారంలో పొర ముడతలుగా ఉంటే మలం ప్రేగులో పొర ముడతలు లేకుండా నున్నగా వుంటుంది.

మలద్వారం దగ్గర రక్తనాళాలు మూడు చోట్ల వుంటాయి. గడియారంలో గంటలని తెలియజేసే స్థానం స్థిరంగా ఎలా ఉంటుందో అదే విధంగా మలం ప్రేగు చివర్లో రక్తనాళాల గుంపు ఒకటి 3 గంటల స్థానంలో ఉంటే మరొకటి 7 గంటల స్థానంలో, ఇంకొకటి 11 గంటల స్థానంలో ఉంటుంది. మొలలు వచ్చినప్పుడు ఈ మూడు స్థలాల్లో రక్తనాళాలు ఉబ్బి బూరా బుడగల్లా కనబడవచ్చు లేదా ఏదో ఒకటి-రెండు స్థానాల్లోనే కనబడవచ్చు.

మొలలు ఒకేసారి మూడు స్థానాల్లోని రక్తనాళాలకి రావా

లని లేదు. ఈ రక్తనాళాల గుంపు మలద్వారంలో మ్యూకస్ పొర క్రింద ఉంటాయి. మొలలు తయారవనపుడు ఇవి కన బడవు.

మొలలు సుపీరియర్, మిడిల్, ఇన్ఫీరియర్ హెమరాయిడల్ వెయిన్స్ నుంచి తయారవుతాయి అందుకని ఏ స్థానంలో మొలలు తయారవుతాయో ఆ స్థానంబట్టి ఫలానా పొజిషన్ పైల్స్ అంటారు.

# 2. మొలలు రకాలు

మొలలు ముఖ్యంగా రెండు రకాలు. *1.* బయటి మొలలు 2. లోపల మొలలు.

బయటి మొలలనే ఎక్స్టర్నల్ పైల్స్ అంటారు. ఇవి సరిగ్గా మలద్వారం దగ్గర చర్మం క్రింద ఉంటాయి. చర్మమే వీటిని మూసి వుంచుతుంది.

ఇంటర్నల్ పైల్స్ మలద్వారం లోపల ఉంటాయి. వీటినే "లోపల మొలలు" అంటారు. లోపల మొలలమీద మ్యూకస్ లేయర్ (పల్చని పొర) కప్పి ఉంటుంది.

కొందరిలో బయట మొలలే ఉంటాయి. ఇంకొందరిలో లోపల మొలలే వుంటాయి. మరి కొంపరిలో రెండూ ఉంటాయి. రెండు రకాల మొలలు ఉన్నప్పుడు మిక్సెడ్ పైల్స్ అంటారు.

బయట మొలలు రావడానికి ఇన్ఫీరియర్ హెమరాయిడల్ ప్లెక్సస్ (దిగువున ఉండే రక్తనాళాలగుత్తి) ఉబ్బటం కారణం. ఇవి ఉబ్బటమే కాకుండా ఇందులో రక్తం గడ్డగా మారవచ్చు. అలా రక్తపుగడ్డగా మారిన మొల వుండుపడవచ్చు. లోపల మొలలు సుపీరియర్ హెమరాయిడల్ ప్లెక్సస్ (పైన

ఉండే రక్తనాళాల గుత్తి) వాచడంవల్ల వస్తాయి. ఇవి మల ద్వారం లోపల పళ్ళని పొర క్రింద ఉంటాయి. ఇవి ప్రారంభ దశలో ఏ బాధా లేకుండా ఉంటాయి. ఉన్నాయని కూడా తెలియదు. నిదానంగా ఉబ్బి మలద్వారం బయటకు వస్తాయి. తిరిగి లోపలికి పోయి కనబడకుండా అవుతాయి. కొంత కాలానికి లోపలకి పోకుండా మలద్వారం బయటే ఉండిపోతాయి. చివరికి అవి పుండుగా మారుతాయి. రక్తం కారుతాయి.

మిక్సెడ్ పైల్స్ కూడా రక్తం గడ్డకట్టి పుండుగా మారుతాయి.

## మొలల్లో మరొక వర్గీకరణ

పైన చెప్పిన విధంగా మొలలని మూడు విధాలైనవిగా పేర్కొనగా వీటిని మరొక రకంగా కూడా వర్గీకరిస్తారు. ఈ రెండవ రకం వర్గీకరణ మొలలు ఉన్న స్థితి ప్రకారం చేయబడింది.

### 1. మొదటి దశ మొలలు :

వీటినే ఫస్ట్ డిగ్రీ పైల్స్ అంటారు. మొలలు మొదటిదశలో ఉన్నప్పుడు అవి కొద్దిపాటిగానే ఉబ్బి ఉంటాయి. విరోచనానికి వెళ్ళినప్పుడు కొద్దిగా రక్తం చిందిస్తాయి. మొదటి దశలో ఉన్న మొలలు మలద్వారం బయటకికనబడవు. మలం వచ్చే మార్గం లోపలే ఉంటాయి.

2. రెండవ దశ మొలలు :

వీటినే సెకెండ్ డిగ్రీ పైల్స్ అంటారు. ఈ దశలో ఉన్న మొలలు విరేచనం అయ్యే సమయంలో మలద్వారం బయటకు వచ్చి మల విసర్జన అవగానే తిరిగి లోపలకి వెళ్ళిపోతాయి. మామూలు సమయంలో రెండవ దశకు చెందిన మొలలు బయటకి కనిపించవు.

3. మూడవ దశ మొలలు :

వీటినే థర్డ్ డిగ్రీ పైల్స్ అంటారు. ఇవి మల విసర్జన సమయంలో బయటకు వచ్చి లోపలకు పోకుండా ఉండిపోతాయి. వ్రేలుపెట్టి నెట్టితేనే లోపలకి వెళతాయి.

4. నాలుగవ దశ మొలలు :

ఫోర్త్ డిగ్రీ పైల్స్ ఉన్న వారిలో వ్రేలుపెట్టి నొక్కినా లోపలికి పోకుండా బయటే ఉంటాయి.

## రక్తం మొలలు - చీముమొలలు

కొందరు రక్తం కారుతున్న మొలలని రక్తం మొలలంటారు. పుండుగా మారినపుడు చీముమొలలు అంటారు. రక్తం మొలలు, చీము మొలలు అంటూ వేరుగా లేవు. మొలలు ఏర్పడినప్పుడు రక్తం కారడం మామూలే, కొందరికి చీము పట్టడం, పుండు అవడం మామూలే అందుకని చీము మొలలు, రక్తం మొలలు, గడ్డ మొలలు అని వేరే చెప్పకూడదు. పైన చెప్పిన విధంగా మొలలు ఉన్న స్థితి బట్టి ఏ దశకి (డిగ్రీకి) చెందినది చెప్పవచ్చు.

బయట మొలలు మొదట దశలోనే ఉన్నా బయట చేతికి తగులుతాయి. వ్రేలుతో నొక్కితే లోపలికి పోవడం ఉండదు.

# 3. మొలలు - కారణాలు

మలద్వారం దగ్గర ఉండే రక్తనాళాలు ఉబ్బడంవల్ల మొలలు ఏర్పడతాయనేది తెలిసిన విషయమే. కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో మొలలు ఏర్పడటం మరొక విశేషం.

కొందరిలో స్పష్టమైన కారణం లేకుండా మొలలు తయారవుతాయి. అలా కాకుండా కొన్ని కారణాలవల్ల మొలలు తయారవడాన్ని సెకండరీ పైల్స్ని లేదా సింప్టమాటిక్ పైల్స్ని అంటారు.

## గర్భిణీ స్త్రీలో మొలలు

కొందరు స్త్రీలలో అంతకు ముందు మొలలు లేకుండా గర్భం వచ్చి సైజు పెరుగుతున్న కొద్దీ మొలల బాధ ఎక్కువ అవుతుంది. కాన్పు అవడంతో మొలల బాధ తొలగి పోతుంది. గర్భిణీగా ఉండగా మొలలు కనబడటానికి బాగా పెరిగిన గర్భాశయం సుపీరియర్ హెమరాయిడల్ వెయిన్స్ని

నొక్కి వేయడం కారణం. రక్తప్రసారం సరిగ్గా ఉండకపోవడంతో రక్తనాళాలు ఉబ్బి మొలలుగా సాక్షాత్కరిస్తాయి.

## ఫైబ్రాయిడ్స్‌లో మొలలు

కొందరు స్త్రీలకి ఫైబ్రాయిడ్స్ వచ్చి మొలలు వస్తాయి. ఫైబ్రాయిడ్స్ గర్భాశయానికి రావడంతో గర్భాశయం పరిమాణం పెరుగుతుంది గర్భాశయం పెద్ద గడ్డగా తయారవుతుంది. ఇలా గడ్డగా తయారైన గర్భాశయం రక్తనాళాల మీద ఒత్తిడి కలిగించడంతో మొలలు వస్తాయి. ఆపరేషన్ చేసి ఫైబ్రాయిడ్స్‌ని (కొయ్య కండలని) తొలగించడమో, గర్భాశయాన్నే మొత్తంగా తీసివేయడమో చేస్తే మొలలు కనబడకుండా పోతాయి.

## మూత్రం బిగపట్టి పోస్తే మొలలు

సాధారణంగా 40-50 సంవత్సరాలు దాటిన వారిలో ప్రోస్టేటు గ్రంధి పరిమాణం పెరుగుతుంది. మూత్రనాళం ప్రోస్టేటు గ్రంధి మధ్యగా వస్తుంది. ఈ గ్రంధి పెరిగినా మూత్రనాళం నొక్కి వేయ బడుతుంది. ఫలితంగా మూత్రం సాఫీగారాదు. ముక్కి ముక్కి పోయవలసి వస్తుంది. ఇలా మూత్రం బిగపట్టి పోసే వారిలో మొలలు కనబడతాయి.

మరికొందరిలో గనేరియా వ్యాధివల్ల మూత్రనాళం మూసుకుపోతుంది. ఎంతో కష్టపడితే తప్ప మూత్ర విసర్జన అవదు.

గ నేరియా వ్యాధివల్లనే కాకుండా ఇతర వ్యాధులువల్ల, కొన్ని ప్రమాదాలవల్ల మూత్రనాళం సన్నబడుతుంది. ఇటు వంటప్పుడు కూడా ముక్కి మూత్ర విసర్జన చేయవలసి వస్తుంది. ఇలా మూత్రం బిగపట్టడం కూడా మొలలు రావడానికి కారణం.

## గుండె జబ్బు, ఊపిరితిత్తుల జబ్బులో మొలలు

ఇన్ఫీరియర్ వీనాకేవా అనే పెద్ద సిర కడుపు ప్రాంతంలో వాచడంవల్ల గుండెజబ్బు రావడం, ఊపిరితిత్తి వ్యాధి రావడం ఉంటుంది. ఇటువంటి పరిస్థితుల్లో కూడా మొలలు రావచ్చు. రక్తపోటు ఉన్న వారిలో కూడా మొలలు వచ్చే అవకాశం వుంది.

## మలం ప్రేగుకి కేన్సరువల్ల మొలలు

మలం ప్రేగుకి (రెక్టమ్)కి కేన్సరు వచ్చిన వారిలో కూడా మొలలు వస్తాయి. మలం ప్రేగులో వచ్చిన కేన్సరు కంతి సుపీరియర్ హెమరాయిడల్ వెయిన్‌ని నొక్కివేసి రక్తం గడ్డగా మారేటట్లు చేస్తుంది. దానివల్ల మొలలు వస్తాయి.

## కారణం లేకుండా వచ్చే మొలలే ఎక్కువ

మొలలు వచ్చిన వారందరికీ ఏదో ఒక కారణం ఉండనవసరం లేదు. మొలలు వచ్చిన అధిక సంఖ్యాకుల్లో ఏ కారణం కనబడదు. ఏ కారణం లేకుండానే మొలలువస్తాయి. కారణంవల్ల మొలలు వచ్చేవారు తక్కువ.

# 4. లోపలి మొలలు

మలం ద్వారం లోపల తయారయ్యే మొలలనే లోపల మొలలనీ, ఇంటర్నల్ పైల్స్ అనీ అంటారు. సాధారణంగా లోపల మొలలు బయటి మొలలతో కలిసి ఉంటాయి. లోపల మొలలు ఎవరిలో వస్తాయో తెలుసుకుందాం.

## వంశ పారంపర్యంగా మొలలు

కొందరిలో వంశ పారంపర్యంగా మొలలు వస్తాయి. తాతకి ఉంటే తండ్రికి, తండ్రికి ఉంటే కొడుకుకి మొలలు రావటం ఆనవాయితీ. వంశ పారం పర్యంగా వారిలో వెయిన్స్ (సిరలు)కి సంబంధించిన గోడలు బలహీనంగా ఉండటం కారణం. సిరలు గోడలు బలహీనంగా పల్చగా ఉండటంతో రక్తనాళాలు ఉబ్బి మొలలు రూపంలో దర్శనమిస్తాయి.

కొందరిలో ధమనుల నుండి అధిక రక్తం సిరలులోకి చేరు తుంది. సిరలు బలహీనంగా ఉన్నప్పుడు అధిక రక్తం సిరల్లోకి చేరగా అవి ఉబ్బి మొలలుగా బయటపడతాయి.

## ఉబ్బిన రక్తనాళాలు – పెరిగిన మొలలు

కొందరికి కాళ్ళకి రక్తనాళాలు (వెయిన్స్) ఉబ్బుతాయి. ఇలా ఉబ్బిన రక్తనాళాలని వేరికోజ్ వెయిన్స్ అంటారు. వేరికోజ్ వెయిన్స్ ఉన్న వారికి మొలలు రావటం ఎక్కువ.

## మనుష్యులకే మొలలు - జంతువులకి అరుదు!

నాలుగుకాళ్ళమీద నడిచే జంతువులకి మొలలు ఉండటం అరుదు. దానికి కారణం అవి నిలువుగా నిలుచుని ఉండక పోవడమే. మొలలు రావడానికి గ్రావిటీ కారణం. నిలువుగా నిలుచునే ప్రాణులకి సిరలలో రక్తం పైకి పోకుండా క్రిందనే నిల్వ అయ్యే అవకాశం ఉంది. అలా నిల్వ ఉండటానికి కారణం సిరలలో వాల్వ్సు (కవాటాలు) చాలా తక్కువ ఉండటమే. మనుష్యులు రెండు కాళ్ళమీద నిలబడి ఉండ టంతో రక్తం మలం ప్రేగు సిరలలో చేరిపోతుంది. దానితో రక్తం అంత తేలికగా పైకి నెట్టబడదు. ఈ విధంగా మనుష్యు లలో మొలలు వస్తాయి.

## ఎక్కువ సేపు నిలుచునే వారిలో మొలలు

ఎక్కువసేపు నిలుచుని పనిచేసే వారిలో మొలలు ఎక్కువ కన బడతాయి. దీనికి కారణం సిరలలోని రక్తం గ్రావిటీవల్ల మల ద్వారం దగ్గర చేరి పైకి వెళ్ళకపోవడం కొంత కారణం కాగా అక్కడ ఉండే సిరలు తమలో చేరిన రక్తాన్ని పైకి నెట్టేం దుకు ప్రక్కన ఉన్న పరిస్థితులు తోడ్పడక పోవడం మరి కొంత కారణం.

మలద్వారం దగ్గర సిరలు ఎక్కువగా ఉబ్బడానికి, కాళ్ళదగ్గర అంతగా ఉబ్బకపోవడానికి ఒక కారణం ఉంది. మనిషి నిలు చుని ఉన్నా అతని కాళ్ళలోని కండరాలు కదులుతూ సిరలని రిథమిక్ గా నొక్కుతూ వాటిలోని రక్తాన్ని పైకి ప్రసరించే

టిష్యు తో ఏర్పడతాయి. ఆ రకంగా శరీరంలో ఏ భాగం నుంచి అయినా సరే సిరలు ద్వారా రక్తం గుండెకు తిరిగి వెళ్ళడానికి వాటితో అనుబంధం ఉన్న కండరాలు, ఇతర టిస్యూలు ముఖ్యపాత్ర వహిస్తాయి.

ఇంటర్నల్ పైల్స్ (లోపల మొలలు) రావడానికి సుపీరియర్ హెమరాయిడల్ వెయిన్స్ (మొలలు రావడానికి కారణ మయ్యే ఒక సిరలు) తగిన సపోర్టు లేకపోవడమే కారణం. ఈ సిరలు అనుబంధం కలిగి ఉన్న మలం ప్రేగులోని టిస్యూ అంతగా బెంపరు లేకుండా లూజుగా ఉండటం ఇందుకు కారణం.

పైగా మలంప్రేగు దగ్గర ఉండే సిరలకి పల్చని కండరాలతో సహకారం ఉంది. రక్తం పైకి సరఫరా అవవలసింది పోయి వాటితో నొక్కివేయబడి రక్తం సరఫరా ఆగిపోతుంది. మలం ప్రేగుతో అనుబంధం ఉన్న పల్చని కండరాలగుండా అక్కడి రక్తనాళాలు ప్రయాణించాలి. మల విసర్జన సమయంలో ఈ కండరాలు నొక్కుకుపోయి వాటిగుండా ప్రయాణించే సిరలనికూడా నొక్కివేస్తాయి. ఆ విధంగా మొలలురావడానికి ఆస్కారం కలుగుతుంది.

మలం ప్రేగు దగ్గర ఉండే ప్రధాన సిరల్లోనూ, వాటి అను బంధ శాఖల్లోనూ కవాటాలు (వాల్వ్స్) ఉండవు. అందుకని రక్తం పైకి నెట్టబడినా పైకి వెళ్ళినట్లు వెళ్ళి మళ్ళీ క్రిందికి జారిపోతుంది. ఆ పరిస్థితే మొలలకి కారణమవుతుంది.

ఎవరిలో అయితే సిరలకి సంబంధించిన ఈ యంత్రాంగం చాలా బలహీనంగా ఉంటుందో వారిలోనే మొలలు వస్తాయి. మలద్వారం దగ్గర సపోర్టింగు టిస్యూలు, కండరాలు సిరల లోని రక్తం సక్రమంగా ప్రయాణించడానికి తోడ్పడినవారిలో మొలలు ఉండవు.

## మలబద్ధకం మొలలుకి మూలం

మలబద్ధకం ఉన్న వారిలో మొలలు ఎక్కువ కనబడతాయి. దానికి కారణం వారు మలవిసర్జన సమయంలో ఎక్కువ ముక్కడం కారణం. మలవిసర్జన సమయంలో గట్టిగా ముక్క డంతో రక్తనాళాలమీద ఒత్తిడి ఏర్పడి రక్తప్రసారం ఆగిపో తుంది. దానితో అక్కడి రక్తనాళాలు ఉబ్బి మొలలుగా తయారవుతాయి.

## విరోచనాలు ఎక్కువయ్యే వారిలో మొలలు

మలబద్ధకం ఉన్నవారు ముక్కడం వల్ల మొలలు ఎలా వస్తాయో అలాగే రోజూ ఎక్కువసార్లు విరేచనం అయ్యే వారికి మొలలు వస్తాయి. ముఖ్యంగా ఎంటరైటిస్, కోలైటిస్, డిసెంట్రీ ఉన్న వారిలో మొలలు కనబడటం ఎక్కువ. ఇటు వంటి వ్యాధులున్న వారికి ఆ వ్యాధులని నివారించినట్లయితే మొలలు తగ్గేందుకు అవకాశం ఉంది.

# 5. మొలల మొదలు ఎక్కడ ?

మొలలు ఏదో ఒక్క కారణంవల్ల కాకుండా రెండు మూడు కారణాలు కలవగా రావడం ఎక్కువ.

యానోరెక్టల్ జంక్షనుకి కాస్త పైన మొలలు మొదలు అవుతాయి. మలం ప్రేగు అంతమై మలద్వారం మొదలయ్యే చోట తెలుపు ఎరుపులో ఒక రింగులాగా వుంటుంది. అక్కడే మొలల మొదలు కనబడుతుంది. మొలల మొదలుని 'పెడికల్' అంటారు.

మలంప్రేగు చివరిలో పుట్టిన మొలలు మలద్వారంలోకి చేరుతాయి. మలద్వారంలో పెక్టినేట్ లైను దగ్గర ఆగిపోతాయి. ఇక్కడ మలం ప్రేగు చూడటానికి ఎర్రగా ఉంటుంది.

బయట మొలలు పెక్టినేట్ లైను మలంవచ్చే రంధ్రం బయట భాగం మధ్య ఉంటాయి. బయట మొలలు మొదలు అంతం స్పష్టంగా కనబడతాయి.

# 6. మొలలు - బాధలు

మొలలు ఉన్న వారికి రకరకాల బాధలు వుంటాయి.

## రక్తం పడటం ప్రధాన లక్షణం

ఏ కారణంవల్ల మొలలు వచ్చినా మలవిసర్జన సమయంలో రక్తం పడటం ప్రధాన లక్షణం. మొలల ప్రారంభదశలో రక్తం కొద్దిగానే పడుతుంది. అలా పడే రక్తం యెర్రగా ఉంటుంది. మొలలు ముదరకుండా నెలలు-సంవత్సరాలపాటు ఉంటాయి. అయితే అంతకాలంపాటు కొద్దో గొప్పో రక్తం మలవిసర్జన సమయంలో పడుతూనే ఉంటుంది.

## మొలల ఉంటే రక్తహీనత

మొలలు వుండి నెలలు—సంవత్సరాల తరబడి మలవిసర్జన సమయంలో కొందరికి అధికంగా రక్తం పడుతుంది. ఇటువంటి వారికి రక్తహీనత కలగడం ఎక్కువ.

ఇంటర్నల్ పైల్స్ ఉన్న వారికి రక్తహీనత కలగడం ఎక్కువ. బయట మొలలు వున్న వారికి రక్తహీనత తక్కువ.

## మలద్వారం బయటకు మొలలు

మలద్వారం బయటకు మొలలు రావడాన్ని 'ప్రొలాప్స్' అంటారు. ఇంటర్నల్ పైల్స్ మొదటిదశలో బయటకు కన బడవు. మలవిసర్జన సమయంలో రక్తం పడటం ఒక్కటే ఉంటుంది. సెకెండు డిగ్రీ పైల్స్ మలవిసర్జన సమయంలో బయటకు వచ్చి మళ్ళీ వెంటనే బయటకు పోతాయి. మూడవదశలో మొలలు ఉన్నపుడు మలవిసర్జన సమయంలో బయటకు వచ్చినా వ్రేళ్ళతో నొక్కివేస్తే లోపలికిపోతాయి. నాలుగవదశ మొలలో ఎంత నొక్కినా లోపలికి పోకుండా మలద్వారం బయటే వుంటాయి. మొలలు వచ్చిన వ్యక్తి ఈ లక్షణాలనుబట్టి పైల్స్ ప్రొలాప్స్ ఏ డిగ్రీలో వున్నాయో తెలుసుకోగలడు.

## జిగట – రక్తం

మొలలు వున్నవారికి మలద్వారందగ్గర జిగట తయారవడం, రక్తంతో మలద్వారం తడిగా మారడం వుంటుంది. మొలలు వున్నవారికి మలద్వారంలో జిగటపదార్థం తయారవుతుంది. దీనినే మ్యూకాయిడ్ డిశ్చార్జి అంటారు. ఇది మలద్వారంలో వుండే మ్యూకస్ పొరనుంచి తయారవుతుంది.

## మొలలు ఉంటే నొప్పి ఉండాలా?

మొలలు వున్నవారిలో నొప్పి ఉండటం అరుదు. చాలా

మందిలో మొలలు వున్నవారికి నొప్పి వుందంటే ఏదో ఒక కాంప్లికేషను తలెత్తినట్లే.

ఇన్ఫెక్షను:-

మొలలు వున్నపుడు బాక్టీరియా క్రిములు, ఇతర వ్యాధి క్రిములు చేరవచ్చు. దానివల్ల మొలలు పుండుగా మారి నొప్పి కలిగిస్తాయి. మొలలకి ఇన్ఫెక్షను రావటం ఎక్కువ.

గాంగ్రిన్:-

మొలలు తయారయ్యే సిరలు పూర్తిగా మూసుకుపోయి రక్త ప్రసారం ఆగిపోయి గాంగ్రిన్ పరిస్థితి వస్తుంది. మొలలుకి గాంగ్రిన్ పరిస్థితి వచ్చినపుడు మొదట్లో నొప్పి వుంటుంది.

థ్రోంబోసిస్ :

మొలలు తయారయ్యే రక్తనాళాల్లో రక్తంగడ్డకట్టి థ్రోంబస్ తయారవుతుంది. థ్రోంబోజ్డ్ పైల్స్ నొప్పి కలిగిస్తాయి.

యానల్ ఫిషరు :—

మొలలతో పాటు కొందరికి ఫిషరు తయారవుతుంది. మల ద్వారం దగ్గర కోసుకుపోయినట్లు వుండటాన్నే ఫిషరు అంటారు. ఫిషరు ఏర్పడినవారిలో నొప్పి వుంటుంది. ఆ నొప్పి మొలలువల్ల కాదు, ఫిషరు ఏర్పడటంవల్లనే. ఫిషరు వల్ల నొప్పి కలుగుతోందని తెలుసుకోలేక తమకి మొలలు నొప్పి వున్నాయని అనుకుంటారు.

మలవిసర్జన సమయంలో రక్తం పతతంబట్టి మొలలు వున్నట్లు అనుమానించవచ్చు. అంతే తప్ప ఇతర్రతా ఎవరికి వారు తమకి మొలలు ఉన్నాయని మొదటిదశలో నిర్ధారణ చేసుకోలేరు. రెండవదశ, మూడవ దశలోనే మలవిసర్జన సమయంలో మొలలు బయటకు వస్తాయి.

వ్రేలుని మలద్వారంలోకి పోనిచ్చి మొలలని తెలుసుకోవడం కుదరదు. మొలలు రక్తం గడ్డకట్టడం వున్నప్పుడే మలద్వారం లోకి వ్రేలు పోనిస్తే గట్టిగా తగులుతాయి. రక్తం గడ్డకట్టడం జరగనవుడు తెలుసుకోవడం కుదరదు. బయటమొలలు అయితే ఏ బాధా లేకుండానే తెలుస్తాయి.

## ప్రోక్టోస్కోపీయే నిర్ధారణ పరీక్ష

ప్రోక్టోస్కోప్ అని ఒక పనిముట్టు వుంది. ఇది వెడల్పాటి గొట్టంలాగా వుంటుంది. దీనిని మలద్వారం లోపలికల్లా పోనిచ్చి నిదానంగా బయటకు తీస్తూ లోపల పరిశీలిస్తూ వుంటే మొలలు ఉబ్బి ఎర్రటి రేగుపళ్ళలాగా కనబడతాయి.

# 7. మొలలు కాంప్లికేషన్లు

కొందరిలో మొలలు ఎంతకాలం వున్నా మలవిసర్జన సమయంలో రక్తం పడటంతప్ప వేరే కాంప్లికేషన్లు, బాధలు ఉండవు. కాని మొలలులో రకరకాల కాంప్లికేషన్లు (దుష్పరిణామాలు) సంభవించవచ్చు.

## అత్యధిక రక్తస్రావం

మొలలు వున్నవారిలో ఉన్నట్లుండి ఒక్కసారి అత్యధిక బ్లీడింగు (రక్తస్రావం) అవవచ్చు. ఈ రకంగా అత్యధికంగా రక్తస్రావం అవడం పైల్స్ రెండవదశలో ఎక్కువ. ఇటువంటి రక్తస్రావం విచిత్రంగా వుంటుంది. ముందు అత్యధికంగా రక్తస్రావం అయిపోతుంది. ఆ తరువాత పైకి మొలలు ముడుచుకుని పోయినట్లు కనిపిస్తాయి. మలద్వారం నుంచి రక్తస్రావం ఉండదు. కాని లోలోపల రక్తస్రావం జరుగుతుంది. మలంపేగు (రెక్టమ్) రక్తంతో నిండిపోతుంది. దానికి కారణం మొలలు ప్రొలాప్స్‌డ్‌గా ఉన్నపుడు మలద్వారంలో రక్తం కారి ముడుచుకుపోయిన తరవాత కారే రక్తం పైన మలం పేగులో చేరుతుంది. దీనినిబట్టి రక్తస్రావం ఆగినట్లు

బయటకు కనబడినా నిజంగా ఆగటం కాదని తెలుసుకోవాలి. అందుకని అత్యధిక రక్తస్రావం అయినపుడు రక్తస్రావం అవుతున్న మొలని మొదట్లోకి ముడివేయాలి.

## పీక పిసికేయబడిన మొలలు

లోపల మొలలు మలద్వారం బయటకు వచ్చినపుడు ఒక్కొక్కసారి బయటవేపు వుండే స్ఫింక్టరు ఆ మొలలని గట్టిగా నొక్కి వేస్తుంది గొంతు నులిమివేయబడినట్లుగా మొలల పరిస్థితికూడా మారుతుంది. ఈ పరిస్థితినే 'స్ట్రాంగ్యులేషను' అంటారు. స్ట్రాంగ్యులేషనువలన మొలలులోని రక్తం పైకి ప్రసరించకుండా ఆపుతుంది.

ఈరకంగా మొలలు నొక్కి వేయబడటం సాధారణంగా సెకండ్ డిగ్రీ పైల్స్‌లో జరుగుతుంది. ఇలా జరిగినప్పుడు విపరీతంగా నొప్పి కలుగుతుంది. అంతవరకు పైల్స్ గురించి పట్టించుకోనివారు యీ బాధ కలగటంతో తల్లడిల్లిపోతారు. తమకి అకస్మాత్తుగా మొలలు వచ్చాయని అంటారు.

'స్ట్రాంగ్యులేషను' జరిగిన మొలలని ఒకటి రెండు గంటల్లో లోపలికి నెట్టివేయకపోతే అందులో రక్తం గడ్డకట్టి వేస్తుంది. మొలలలో త్రోంబస్ తయారవుతుంది.

## రక్తం గడ్డకట్టడం (త్రోంబస్)

మొలలులో రక్తం గడ్డకట్టినపుడు అవి నేరేడు పళ్ళు

లాగా ఊదాగా మారుతాయి. కొందరికి నల్లగా వుంటాయి. మొలలలో రక్తం గడ్డకట్టినపుడు మలద్వారం చుట్టూ వాపు వస్తుంది. థ్రోంబోసిస్ మొదటి దశలో నొప్పి వుండి తరవాత నొప్పి తగ్గిపోతుంది. కాని రక్తంగడ్డ అలాగే వుంటుంది.

## చీముపట్టడం

మొలలుకి స్ట్రాంగ్యులేషన్ను థ్రోంబస్ ఏర్పడిన తరవాత చీముపట్టుతాయి. మొత్తం మొలలు చీముగా మారకపోయినా మొలల పైపొర చీముపట్టి చీము మొలలుగా కనబడతాయి.

## గాంగ్రిన్

మొలలకి రక్తం సరఫరాచేసే ధమనులు మొలలతో పాటు నొక్కి-వేయబడినపుడు రక్తప్రసారం ఆగిపోయి కుళ్ళిపోతాయి. మొలలు కుళ్ళిపోవడాన్నే పైల్స్ గాంగ్రిన్ అంటారు.

మొలలలో యేదో ఒకటి యిలా కుళ్ళిపోవచ్చు లేదా అన్నీ కుళ్ళిపోవచ్చు. మొలలకి గాంగ్రిన్ కలిగినపుడు ఒక్కొక్క-సారి మొలలు మాత్రమే కాకుండా మలద్వారం లోపల పల్చనిపొర కుళ్ళి వుండుగా మారుతుంది.

## ఫైబ్రోసిస్

మొలలలో రక్తం గడ్డకట్టినా కొందరికి ఫైబ్రోసిస్ తయారవు

తుంది. ఫైబ్రోసిస్ తయారయిన మొలలు తెల్లగా గట్టిగా మారుతాయి. మలద్వారం నుంచి వ్రేలాడుతూ కనబడతాయి.

## చీముగడ్డ

మొలలు చీముపట్టడం ఒక ప్రక్క ఉండగా మరొక ప్రక్క మొలలు చీముగడ్డలుగా మారే అవకాశం వుంది.

# 8 మొలల దుష్పరిణామాలకి చికిత్స

మొలల విషయంలో కాంప్లికేషను కనబడగానే చికిత్స చేయాలి.

మొలలు నొక్కుకుపోవడం, రక్తంగడ్డకట్టడం కుళ్లిపోవడం

మొలలు నొక్కుకుపోయి అకస్మాత్తుగా నొప్పి కలిగినప్పుడు మత్తు ఇచ్చి వాటిని మలద్వారం లోపలకి నెట్టి వేయాలి. ఒక వేళ నొక్కుకుపోయిన మొలల్లోని రక్తం కడ్డగట్టి త్రోంబస్‌గా తయారైనట్లయితే వాటిని లోపలికి నెట్టినా ఉండకుండా తిరిగి వెంటనే బయటకు వస్తాయి. అటు వంటప్పుడు రోగిని బెడ్ మీద పడుకోబెట్టి కాళ్ళవైపు బెడ్‌ని ఎత్తు చేయాలి. నార్మల్ సలైనులో ముంచిన మెత్తని గుడ్డని మొలలమీద ఉంచి బ్యాండేజి వేయాలి. ప్రతీ 4 గంటలకి ఒక సారి బ్యాండేజిని మార్చాలి. నార్మల్ సలైనులో గుడ్డ ముంచి బయటకు వచ్చిన మొలలమీద వేయాలి. ఔన్సు చొప్పున లిక్విడ్ పారాఫిన్ రోజుకు 3 సార్లు ఇవ్వాలి. ఇన్ఫెక్షన్ అరికట్టడానికి యాంటిబయాటిక్ మందులు వాడాలి. రోగికి రోజు విరోచనం అవ్వాలి. రెండు మూడు రోజులపాటు విరోచనం కాకపోతే గ్లిసరిన్ ఎనిమా ఇవ్వాలి. సాధారణంగా ఇటువంటి చికిత్సతో మొలలు మెత్తబడతాయి. పరిమాణం

తగ్గుతాయి. నిదానంగా లోపలికి వెళ్ళిపోతాయి. ఏ బాధ లేకుండా ఉంటుంది. ఆ తర్వాత 15 రోజులలో ఆపరేషన్ చేసి మొలలు తొలగించాలి.

## అధికరక్తస్రావమైనప్పుడు చికిత్స

మొలలు అధికంగా బ్లీడ్ అవుతున్నప్పుడు ముందు మలం ప్రేగుల్ని చేరిన రక్తాన్ని తీసివేయాలి. నార్మల్ సలైనుతో మలం ప్రేగుని కడగాలి. ఆ తర్వాత ఎడ్రినల్ వేసిన నీళ్ళలో గుడ్డ ముంచి మలద్వారంలో టైటుగా పెట్టాలి. సాధారణంగా ఈ చికిత్సతో పైల్స్ బ్లీడ్ అవడం ఆగిపోతుంది.

కొందరికి మొలలు అధికంగా బ్లీడ్ అయి రక్తహీనత ఏర్పడుతుంది. బాగా నీరసంగా కనబడతారు. అటువంటప్పుడు 1-2 బాటిల్స్ రక్తం ఎక్కించాలి.

## శాశ్వతంగా బయటకి వచ్చిన మొలి

మొలలు బయటకువచ్చి వుండిపోయినవారికి గ్లిసరిన్ బ్యాండేజి వేయాలి. దానితో మొలల సైజు తగ్గిన తర్వాత సర్జరీ చేయాలి.

# 9 బయట మొలలు

మలద్వారం మార్జిన్‌లో బయట మొలల ఉంటాయి. బయట మొలలనే ఎక్స్టెర్నల్ పైల్స్ అంటారు.

బయట మొలలు రెండు రకాలుగా ఉంటాయి.

ఒక రకం:- మలద్వారం దగ్గరే చర్మం క్రింద రక్త నాళాలు (సిరలు) ఉబ్బి కనబడేవి.

రెండవ రకం:- మలద్వారం దగ్గర చర్మం క్రింద సిరలలో రక్తం గడ్డగట్టి కనబడేది.

సాధారణంగా రోగి "బయట మొలలని" పట్టించుకోడు కాని మొలలలో రక్తం గడ్డ గట్టి నొప్పి అనిపించినప్పుడే వాటిని గుర్తిస్తాడు.

బయట మొలలో రక్తంగడ్డకట్టినప్పుడుకలిగేనొప్పిలో తేడాలు ఉంటాయి. మొలలలో రక్తంగడ్డ చిన్నదైతే నొప్పి తక్కువ ఉంటుంది. పెద్దదైతే నొప్పిఎక్కువ ఉంటుంది. అంతేకాక మల ద్వారానికి సంబంధించిన కండరం (యానల్ స్పింక్టరు)లో మొల ఉండి అందులో రక్తం గడ్డ తయారైతే నొప్పి అధికంగా ఉంటుంది.

బయటమొలలో రక్తం గడ్డ కట్టినప్పుడు పగిలి రక్తం కారుతుంది. చిన్న రక్తం గడ్డ అయితే రక్తం కారడంవుండదు

బయట మొలలు చీముపట్టినప్పుడు మలద్వారం దగ్గర వాపు వస్తుంది. బాగా నొప్పి ఉంటుంది.

సాధారణంగా బయటమొలలతో పాటు లోపలమొలలు కూడా కలిసి ఉంటాయి.

## చికిత్స చేయకపోతే...

ఆపరేషను చేసి మొలలను తీసివేస్తే బాధ తగ్గిపోతుంది చికిత్స చేయకపోతే కొందరికి మొలలు వాటంతటవే అణగి పోతాయి. మరికొందరిలో చీముపట్టి కుళ్లుతాయి. ఇంకొందరికి మొలలు ఎండి చర్మం ముడతలువలె తయారవుతాయి. బయట మొలలకి తగిన చికిత్స చేయకపోతే పగిలి రక్తం గడ్డ బయటకు వస్తుంది. అధిక సర్వ్యాక కేసుల్లో బయటమొలలు అణగిపోయి గట్టిగా మారుతాయి.

## "సెంటినల్ పైల్"

కొందరికి మలద్వారం వెనుకభాగంలో బుడిపిలాగా స్పష్టంగా తగులుతుంది. మొదట్లో ఆ బుడిపి చాలా బాధ ఉంటుంది. కొంత కాలానికి వాపు తగ్గిపోయి చిన్న ఉండగా మారుతుంది. చాలా మంది దీనినికూడా మొల అనుకుంటారు మొల అయినట్లయితే రక్త నాళాలు ఉండాలి. ఇందులో రక్త నాళాలు ఉండవు. రక్తనాళాలు ఉబ్బటంవల్ల ఇదిరాదు. మల

ద్వారం లోపల ఫ్రిషరు ఏర్పడటంవల్ల లోపలనుంచి వచ్చిన మ్యూకస్‌పొర బయట చర్మం కలిసి ఇటువంటి బుడిపి తయారవుతుంది. ఈ బుడిపినే 'సెంటినల్ పైల్' అంటారు. యానల్ ఫిషరు పుండుగా ఉన్నప్పుడు ఇది కూడా పుండుగా మారి బాధ కలిగిస్తుంది.

'బయట మొలలని' భ్రమింపజేసే "మొలలుకాని మొలలు"

కొందరిలో మల ద్వారంచుట్టూ వైరస్ ఇన్‌ఫెక్షను వల్ల 'యానల్ వార్ట్స్' ఉంటాయి. పోడోఫిలిన్ సల్యూషన్ రాస్తే ఇవి రాలిపోతాయి.

మలద్వారం దగ్గర 'కాండైల్ మాటా' వచ్చి బయట మొలలుగా భ్రమింపజేస్తాయి.

'స్క్వామస్ సెల్ కార్సినోమా'ని కూడా బయట మొలలుగా భ్రమ చెందుతారు. అందుకని పరీక్ష చేయించుకుని ఏదైనదీ నిర్ధారణ చేసుకోవాలి.

## 10. ఆపరేషన్ లేకుండా మొలలకి చికిత్స

మొలలు మొరటిదశలో గాని, రెండవ దశ ప్రారంభంలో గాని ఇంజక్షన్ ఇచ్చి నయం చేయవచ్చు. కొందరికి ఇలా చికిత్స చేసినా తిరిగి కనపడతాయి.

మెంథాల్, ఆల్మండ్ ఆయిల్‌తో కలిపిన 5 శాతం ఫెనాల్ మిశ్రమద్రవం 3-5 యం. యల్ మొలలులోకి ఇంజక్షను చేయాలి. దానితో మొలలు శాశ్వతంగా ముడుచుకుపోతాయి.

ఇంజక్షను చికిత్స నొప్పి ఉండదు. కాంపికేషన్లు ఉండవు. కాని తప్పకుండా తగ్గుతాయనే నమ్మకం లేదు.

మూడవదశలో ఉన్న మొలల విషయంలో ఇంజక్షను చికిత్స పనికిరాదు. ఒకసారి ప్రయత్నం చేసి విఫలమైన సెకెండ్ డిగ్రీ పైల్స్ విషయంలో కూడా ఈ చికిత్స పనిచేయదు.. మొలలు గట్టిపడిన వాటి విషయంలో కూడ ఈ చికిత్స పనికిరాదు. మొలలకి ధమనులద్వారా రక్తం చిక్కగా సరఫరా అవుతున్నప్పుడు కూడా ఈ చికిత్స పనికిరాదు.

### రబ్బరు రింగ్ లైగేషను

జడకి రబ్బరుబ్యాండు పెట్టినట్టు లోపల మొలలని జాగ్రత్తగా పట్టుకొని ప్రత్యేక పనిముట్టుతో మొలలు

మొదలులో రబ్బరు రింగుని తొడగడాన్ని 'రబ్బరు రింగ్ లైగేషను' అంటారు. ఈ పద్ధతి వల్ల కొందరికి మంచి ఫలితం కనబడినా ఇన్‌ఫెక్షన్ రావడానికి, మొలలులో రక్తం గడ్డకట్టడానికి, రక్తస్రావం అవడానికి ఆస్కారం ఉంది. మొలల బాధ నుంచి పూర్తి విముక్తికి ఆపరేషన్ సరైన పద్ధతి.

## క్రయో సర్జరీ

క్రయో సర్జరీలో కత్తితో కోయడం ఉండదు. ఒక ప్రత్యేకమైన పనిముట్టుతో మొలని ఐస్‌ఫ్రీజ్ చేస్తారు. అలా చేయడంతో మొలలోని టిస్యూలు కుదించుకుపోయి నిర్వీర్యం అవుతాయి, నిదానంగా మొలలోని పదార్థం కుదించుకుపోయి మొదలుకంటా ఎండిపోతుంది.

మంచు కురిసి మంచుగడ్డ ఏర్పడినట్టు క్రయో సర్జరీలో క్రయోప్రోబ్ ద్వారా పైల్స్ మీద మంచు కురిపిస్తారు. రెండు నిమషాల్లో ఈ పని పూర్తి అవుతుంది. క్రయోసర్జరీ నొప్పి అనిపించకుండా మత్తు ఇంజక్షన్ ఇస్తారు.

క్రయోసర్జరీ సింపుల్ అనిపించినా మలద్వారంలో నొప్పి అనిపించడం, వాపు రావడం ఉంటుంది. కొందరిలో మలద్వారం నుంచి కొంత డిశ్చార్జి అవుతుంది.

## డై లటేషన్

లార్డ్స డై లటేషన్ పద్ధతిలో మలద్వారాన్ని డై లటార్స ద్వారా వెడల్పు చేయడం మొలలని నొక్కి పట్టడం ఉంటుంది. డై లటార్స ద్వారా మొలలని అదిమి ఉంచడంతో అవి నిదానంగా అణగిపోతాయనే అభిప్రాయం ఉంది. ఇటువంటి చికిత్సా విధానంవల్ల ఫస్టుడిగ్రీ పైల్స 60–70 శాతం తగ్గిపోవడం ఉంటుంది. బ్లీడింగ్ సమస్య చాలావరకు తగ్గిపోతుంది.

శస్త్రచికిత్సతో సంబంధం లేకుండా ఈ విధంగా మొలలకు చికిత్స పూర్తి నివారణ కలిగించదు. తాత్కాలిక ఉపశమంతో ఎక్కువ కేసుల్లో ఉంటుంది. అందుకని మొలలకి శస్త్రచికిత్స సరైన పద్ధతి.

# 11. మొలలకి ఆపరేషన్

మొలల ఆపరేషన్ చేయడానికి 1-2 రోజుల ముందు నుంచే ఘనపదార్థం ఇవ్వకుండా ద్రవపదార్థం ఇవ్వాలి. ఘనపదార్థం ఆపివేసినరోజున విరోచనానికి ఇవ్వాలి. రెండవరోజున రెండు మూడుసార్లు ఎనిమా ఇవ్వాలి.

మొలలకు ఆపరేషనుకి పూర్తి మత్తుగాని వెన్నుకి ఇంజక్షను గాని ఇవ్వాలి. మొలలని పూర్తిగాలాగి పట్టుకుని మొదలులో దారంతో ముడివేసి కట్ చేయాలి లోపల మొలలు, బయటి మొలలు రెండూ ఉంటే రెండింటినీ వేరు వేరుగా పట్టుకొని ముడివేసి కట్ చేయాలి. మొలల ఆపరేషన్ అయిన తరువాత మల ద్వారాన్ని బ్యాండేజ్ గుడ్డతో ప్యాక్ చేసి 12-24 గంటలు ఉంచాలి. ఆపరేషన్ తరువాత కూడా రెండురోజులు ద్రవపదార్థం ఇవ్వాలి.

కొంతమందికి మొలలతో పాటు ఫిషర్ ఉంటుంది. దానికికూడా అదే సమయంలో ఆపరేషన్ చేయాలి. మొలల ఆపరేషన్ చేసి ఫిషరుని వదిలివేస్తే అది తిరిగి బ్లీడ్ అవడం, నొప్పి చేయడం ఉంటుంది.

# 12. మొలలకి నాటు వైద్యం

కొందరికి మొలలకి నాటు వైద్యం, చిట్కా వైద్యం చేయించుకుంటారు. దానివల్ల ఫలితం లేదుకదా చీముపట్టి దుష్ఫలితాలు కలుగుతాయి. మొలలకి చికిత్స క్వాలిఫైడ్ డాక్టరు చేత చేయించుకోవాలిగాని నాటు డాక్టర్ల చేత చేయించుకోకూడదు. నాటుడాక్టర్లు మొలలుఆపరేషన్ పూర్తిగాచేయరు కేవలం మలద్వారం నుంచి బయటకు వచ్చినంత మేరకే వైల్స్‌ని దారంతో ముడివేసికట్ చేస్తారు. లోపల మామూలుగానే ఉండి రక్తం పడుతూ ఉంటుంది ఇన్‌పెక్షనువచ్చి వాచిపోతుంది. విరోచనం అవడం కష్టం అవుతుంది. నాటు డాక్టర్ల చికిత్సవలన మొలలు ఆపరేషను చేసినా మళ్లీ వస్తాయనే అపోహఉంది. కాని చేయవలసిన విధంగా ఆపరేషన్ చేస్తే తిరిగి మొలలు రావడం ఉండదు.

ఆపరేషను లేకుండా చిట్కా వైద్యంతో మొలలని నయం చేయడం కూడా ఒట్టిమాట. ఏవేవో పూతలు పూయడంవల్ల మొలలు తాత్కాలికంగా పరిమాణం తగ్గవచ్చు అంతేతప్ప మొలలు లేకుండాపోవు.

చాలామంది నాటు డాక్టర్లు మొలల ఆపరేషనుతో ఛీటింగు చేయడంతప్ప మరేమికాదు. పైగా వీళ్ళు మొలలు కాని వాటినికూడా మొలలుఅంటూ అర్ధాపర్ధంలేని చికిత్స చేస్తారు. వీరి చికిత్సవల్ల కేన్సర్ వంటి వ్యాధులు ముదిరిపోయే ప్రమాదం ఉంది.

# 13 మొలలు ఆపరేషనుతరువాత తీసుకోవలసిన శ్రద్ధ

మొలలు ఆపరేషను తరువాత విరోచనం సాఫీగా అయ్యేటట్లు జాగ్రత్తపడాలి. విరోచనం గట్టిగా అయితే మల విసర్జన సమయంలో ఆపరేషను చేసిన చోట గీసుకుపోయి మరింత బాధ కలుగుతుంది. అందుకని విరోచనం సాఫీగా అవడానికి రోజూ ఆహారంలో ఆకుకూరలు తీసుకోవాలి. అరటిపళ్ళు తినాలి. వీటివల్ల మలబద్ధకం లేకుండా విరోచనం సాఫీగా అవుతుంది.

వారం పదిరోజులు రోజూ రాత్రిపూట భోజనం తరువాత లిక్విడ్ పారాఫిన్ ఒక ఔన్సు తీసుకోవాలి. లేదా ఎగ్రాల్ లిక్విడ్, క్రీమోఫిన్ (పింక్) లిక్విడ్ రాత్రి భోజనం తరువాత రెండు చెంచాలు తీసుకోవాలి. మంచినీళ్ళు ఎక్కువగా త్రాగాలి.

ఆపరేషన్ చేసినచోట నొప్పి ఉంటే ప్రోక్టోసెడైల్ ఆయింట్మెంటుగాని, జైలోకైన్ ఆయింట్మెంటుగాని రెండుపూటలా రాయాలి.

## 14. మొలలని భ్రమకలిగించే రెక్టల్ ప్రొలాప్స్

మలం ప్రేగు బయటకు జారి మలద్వారం దగ్గర మొలలు వచ్చినట్లు భ్రమ కలిగిస్తుంది.

రెక్టల్ ప్రొలాప్స్ పాక్షికం కావచ్చు, పరిపూర్ణంకావచ్చు. రెక్టల్ ప్రొలాప్స్ పాక్షికం అయినప్పుడు కేవలం మ్యూకస్ పొర మల ద్వారం చుట్టూ 1/2 అంగుళం నుండి 1 1/2 అంగుళం ఉంటుంది. వేళ్ళతో పట్టుకొని పరిశీలిస్తే స్పష్టంగా మ్యూకస్ పొరలు తెలుస్తాయి.

### పాక్షికంగా ప్రొలాప్స్

పాక్షికంగా రెక్టల్ ప్రొలాప్స్ చంటి పిల్లలు, వృద్ధులలో సహజం. చంటి పిల్లలు విరోచనాలు అయినప్పుడు ప్రేగు జారడం ఉంటుంది. ఇలా జారిన ప్రేగుని వేళ్ళు పెట్టి లోపలికి నెట్టితే వెళ్ళిపోతుంది. బలహీనంగా వున్న పిల్లల్లో, కోరింతదగ్గు వున్న పిల్లల్లో ప్రేగుజారడం ఉంటుంది. వృద్ధుల్లో కూడా విరోచనాలు బలహీనతవల్ల పాక్షికంగా రెక్టల్ ప్రొలాప్స్ ఉంటుంది. సాధారణంగా వ్రేలుతో నెట్టితే లోపలికి పోతుంది.

### పూర్తి ప్రొలాప్స్

పూర్తి ప్రొలాప్స్ ఉన్నవారికి మలం ప్రేగు మొత్తం

పొరలు మలద్వారం గుండా బయటకు త్రోసుకువస్తాయి. ఇలా త్రోసుకువచ్చిన ప్రేగు 1 1/2 నుండి 4-5 అంగుళాలు ఉంటుంది. ఇలా జారిన ప్రేగుకూడా నెట్టితే లోపలికిపోవచ్చు అలా పోకుండా మాటిమాటికి వస్తున్నా, అలాగే ఉండి పోయినా సర్జరీ చేసి జారకుండా ఫిక్స్ చేయవలసి ఉంటుంది. పాక్షికంగా జరిగే ప్రొలాప్స్ కూడా చాలామంది మొలలని భ్రమచెందుతారు. మొలలకి వాడే ఆయింటుమెంట్లు రాస్తారు. కాని అది సరైన చికిత్స కాదు.

# 15. ఫిషర్

మలద్వారంలో వచ్చే ఫిషరుని 'యానల్ ఫిషరు' అంటారు. ఫిషరుని "నిలువుపాటి పుండుగా" చెప్పుకోవచ్చు. శరీరం మీద ఎక్కడైనా గీసుకుపోయి పుండుగా ఎలా కనపడుతుందో అదే విధంగా యానల్ ఫిషరు మలద్వారంలో కనబడుతుంది.

యానల్ ఫిషరు సాధారణంగా మలద్వారంలో వెనుకవైపు ఉంటుంది. వెనుకవైపు మగ పురుషుల్లో 90 శాతం మందికి ఉంటే స్త్రీలలో 60 శాతం మందికి ఉంటుంది. మల ద్వారానికి ముందువైపు కూడా ఫిషరు ఉంటుంది. 10 శాతం మంది పురుషులలో ముందువైపు ఉంటే 40 శాతం స్త్రీలలో కూడా ముందువైపు ఫిషరు ఉంటుంది.

## ఫిషరులో నొప్పి ఎక్కువ

ఫిషరు స్త్రీలలో ఎక్కువ. చిన్నపిల్లల్లో కూడా ఫిషరు ఎక్కువగా ఉంటుంది. వృద్ధులలో ఫిషరు తక్కువ.

కొందరిలో ఫిషరు అకస్మాత్తుగా ఏర్పడి ఎంతో నొప్పి కలిగిస్తుంది. మరికొందరిలో ఫిషరు క్రానిక్‌గా ఉండి కొద్దిపాటి బాధ కలిగిస్తుంది.

ఫిషరు ప్రధాన లక్షణం నొప్పి. ముఖ్యంగా మల విసర్జన సమయంలో నొప్పి తీవ్రంగా ఉంటుంది. అలా వచ్చిన నొప్పి ఒక గంటపాటు ఉంటుంది. ఫిషరు లోతుగా ఉన్నకొద్దీ నొప్పి తీవ్రంగానూ, ఎక్కువసేపు ఉంటుంది.

ఫిషరు నొప్పి ఒక్కొక్కసారి అకస్మాత్తుగా తగ్గి పోతుంది. వారం - పదిరోజులపాటు ఏ బాధా లేకుండా ఉంటుంది. అలాగే ఎంతో తీవ్రంగా అనిపించిన నొప్పి తిరిగి విరోచనం అయ్యేవరకు లేకుండా పోతుంది.

ఫిషరునొప్పి కొందరికి నడుము నొప్పిలాగా అని పిస్తుంది. మరికొందరికి సయాటికా నొప్పిలాగా అనిపిస్తుంది. తొడల్లోకి కూడా నొప్పి ప్రాకుతుంది. కొందరిలో ఫిషరు నొప్పి తీవ్రంగా అనిపించి మూత్రవిసర్జన అవుతుంది.

## ఫౌంటెన్‌లాగా చిమ్మే రక్తం

ఫిషరు ఉన్న వారిలో రక్తం ఫౌంటెన్ లాగా రక్తం చిమ్ముతుంది. మలం మీద చారలాగా రక్తం ఉంటుంది.

ఫిషరువల్ల కొందరికి మల ద్వారం సన్నబడుతుంది. బిగుసుకుంటుంది. మలవిసర్జన సమయంలో సాగిన నొప్పి అనిపిస్తుంది.

ఫిషరు వల్ల మలద్వారం నుంచి తెల్లని ద్రవం వస్తుంది. మ్యూకస్ కూడా కలిసి ఉంటుంది.

## మలద్వారం దగ్గర దురద

ఫిషరు ఉన్న వారందరిలోనూ మలద్వారం దగ్గర దురద ఉంటుంది. ఫిషరు వల్ల దురద అని తెలుసుకోక నులిపురుగు వల్లో మరొకందుకో దురద అనుకుంటారు. ఫిషరుకి చేస్తే దురద తగ్గిపోతుంది.

ఫిషరు ఉన్న వారందరిలోనూ మలద్వారం దగ్గర సెంటినల్ పైల్ ఉంటుంది. సెంటినల్ పైల్ చర్మం బుడిపి వంటిది. ఇది వాస్తవానికి పైల్ కాదు. కేవలం టిస్యూ ముద్ద.

## ఫిషర్ ఉంటే నొప్పి తగ్గడం ప్రధానం

యానల్ ఫిషర్‌లో నొప్పి ఎక్కువగా ఉంటుంది. ముందు నొప్పి తగ్గడానికి చికిత్స చేయాలి.

ప్రోక్టోసెడ్రైల్ ఆయింట్‌మెంట్ మలద్వారం లోపల రాయాలి. దానివల్ల నొప్పి కంట్రోలు అవుతుంది. ఈ ఆయింటుమెంటు విరోచనం అవగానే వెంటనే రాయాలి. విరోచనం పల్చగా కాకుండా సాఫీగా అవ్వాలి. అందుకని రెండు పూటలా లిక్విడ్ పారాఫిన్ గాని, ఎగ్రాల్ జెల్

గాని యివ్వాలి. విరోచనం మెత్తగా అయ్యేటట్లు చూడాలి.

ఫిషరుతో ఇన్‌ఫెక్షన్ కలసి ఉంటుంది. అందుకని 'ఎరాత్రి మైసన్ - 500' క్యాప్సూల్స్ ప్రతీ 6 గంటలకీ ఒకటి చొప్పున వారం రోజులు వాడాలి.

'మెట్రోజల్ - 400 బిళ్ళలు ఉదయం 1, మధ్యాహ్నం-1, రాత్రి – 1 చొప్పున వారం రోజులు వాడాలి.

## ఫిషరుకి ఆపరేషన్

చాలామందికి ఆపరేషన్ అవసరం లేకుండా మందులద్వారా, విరోచనం సాఫీగా అవడంతో ఫిషరు తగ్గుతుంది. అలా తగ్గని వారికి 'స్పింక్టరాటమీ' సర్జరీ ద్వారా ఫిషరుకి చికిత్స చేయాలి.

ఆపరేషన్ అయిన తరువాత కొద్దిరోజులపాటు విరోచనం సాఫీగా అవడానికి మందులు వాడాలి.

స్పింక్‌రాటమీ ఆపరేషన్ ద్వారా నొప్పి తగ్గిపోతుంది. పుండు మానడానికి వారంరోజులు. యాంటీబయాటిక్ మందులు వాడాలి.

# 16. ఫిస్టులా

మలద్వారం దగ్గర ఉండే ఫిస్టులాని ఫిస్టులా-ఇన్-యానో అంటారు.

శరీరంలో ఒకభాగం నుంచి మరొకభాగానికి ట్యూబ్ వంటి కనక్షను ఏర్పడటాన్ని ఫిస్టులా అంటారు.

ఫిస్టులా-ఇన్-యానోలో మలం ప్రేగుకి బయటకిమార్గం ఏర్పడుతుంది.

## నొప్పి, వాపు డిశ్చార్జి

యానల్ ఫిస్టులా ఏర్పడినవారికి మల ద్వారం దరి దాపుల్లో ఒక రంధ్ర ఏర్పడుతుంది. ఆ రంధ్రం నుంచి చీము కారుతూ తడిగా ఉంటుంది. రంధ్రం దగ్గర కొంతవాపు ఫిస్టులా కన్నం నుంచి సన్నటి స్టీలు కడ్డీ దూర్చితే అది మలం ప్రేగులోకి వెళుతుంది. అలా వెళ్ళడానికి కారణం బయట నుంచి మలం ప్రేగులోకి సొరంగంలాగా మార్గం ఏర్పడటమే.

# 17. ఫిస్టులా ఎందుకు వస్తుంది?

మలం ప్రేగు ప్రక్కన చీము గడ్డ ఏర్పడుతుంది. ఈ చీము గడ్డ లేచిన తరువాత ఆ చీము ఏదో రకంగా బయటకు రావాలి. అలా వచ్చే ప్రయత్నంలోనే చీముగడ్డ కొంత బయటవైపు పగిలి చీము కారుతుంది. కొంత చీము మలం ప్రేగుని కన్నం పెట్టుకొని అందులోకి చేరుతుంది. ఈవిధంగా చీముగడ్డ తయారైనవారిలో మలద్వారం ప్రక్కన కుళ్ళి పోతుంది. అనారోగ్యమైన కండ చేరుతుంది. దానికి తోడు ఒక ట్యూబ్ వంటిది ఏర్పడుతుంది. ఈ ట్యూబునే "ఫిస్టులా ట్రాక్" అంటారు.

మామూలుగా ఏదైనా పుండు పడితే అందులోని చీము అంతా బయటకు వచ్చి పూర్తిగా ఎండిపోతుంది.

మలద్వారం ప్రక్కనే ఏర్పడే పుండు ఇందుకు భిన్నంగా ఉంటుంది. పుండు పగిలి చీము బయటకు వచ్చినా ఇంకా చీముక్రిములు లోపల మిగిలి ఉంటాయి. అక్కడ కండని కుళ్ళ బెట్టుతూనే ఉంటాయి. దానివల్లకన్నంబడ్డ చోటునుంచి ఎప్పుడూ రసి కారుతూ చికాకు పరుస్తుంది. ఆ రసివల్ల పుండు దగ్గర, చుట్టూతా దురద ఉంటుంది.

# 18 ఫిస్టులా రకాలు

సాధారణంగా ఫిస్టులాలో ఒకటే రంధ్రం ఉంటుంది. కొందరిలో రెండు మూడుకూడా ఉంటాయి. రంధ్రాలుదానికి కారణం కొంతకాలంపాటు చీముకారినతరువాత పాతరంధ్రం మూసుకుపోతుంది. ఈలోపల లోపల తయారైన చీము మరొకచోట రంధ్రం పెట్టుకొని బయటకు వస్తుంది. ఒక్కొక్కసారి పాత రంధ్రంలో నుంచే చీము కారుతుంది.

ఫిస్టులా రంధ్రం మల ద్వారానికి 1 1/2 అంగుళం దూరంలోనే ఉంటుంది. ఈ రంధ్రం దగ్గర బొడిపిలాగా తేలుతుంది. ఆ బుడిపి సూది బెజ్జమంత ఉంటుంది. కొందరికి ఈ పుండు పైకి పూర్తిగా మాడిపోయినట్లు ఉంటుంది. చాలా కాలం ఏమీలేనట్లే ఉంటుంది. కాని ఎప్పుడోకప్పుడు తిరిగి బయట పడుతుంది. పై రంధ్రం పూడిపోయి లోపల చీము పేరుకుని పోయినప్పుడు సలపరం, నొప్పి ఉంటాయి.

ఫిస్టులా రంధ్రం కొందరికి ఈ మలద్వారానికి ఒకవైపు ఉంటే మరికొందరికి రెండువైపులా ఉంటుంది. సాధారణంగా మలద్వారం ముందువైపు ఏర్పడిన ఫిస్టులాట్రాక్ నేరుగా మలంప్రేగులోకి ఉంటే మల ద్వారానికి వెనుక ఏర్పడిన

ఫిస్టులా ట్రాక్ ఆర్చిలాగా తయారై మలం ప్రేగులోకి చేరుతుంది.

ప్రోక్టోస్కోప్‌తో పరీక్షి చేస్తే మలంప్రేగులో ఫిస్టులా వల్ల ఏర్పడిన రన్నం కనబడుతుంది.

ఫిస్టులా రన్నంలోకి రేడియో ఓపేక్ ద్రవం ఎక్కించి ఎక్స్ రే తీస్తే ఫిస్టులా ఎక్కడి నుంచి ఎక్కడి వరకు ఉన్నదో మలం ప్రేగుతో ఎక్కడ కలిసినదీ తెలుస్తుంది.

# 19. ఫిస్టులా రావడానికి ఇతర కారణాలు

కొందరికి ఫిస్టులా మలద్వారం అంచులో వుంటుంది. చూడ్డానికి యానల్ ఫిషరులా అనిపిస్తుంది. కాని సెంటినల్ పైల్ దగ్గరనుంచి ఫిస్టులా ట్రాక్ బయలుదేరుతుంది.

క్షయ :-

క్షయవ్యాధివల్ల కూడా ఫిస్టులా ఏర్పడుతుంది. క్షయవ్యాధి ఉన్న 30 శాతం మందిలో మలద్వారం దగ్గర ఫిస్టులా వచ్చే అవకాశం వుంది. అందుకనే ఫిస్టులా ఉన్న వారందరినీ పూర్తిగా పరీక్షచేస్తే వారిలో 8 శాతం మందికి శ్వాసకోశాలలో క్షయవ్యాధి వుంటుంది.

ప్రేగు టి. బి. :-

మలం ప్రేగులో క్షయవ్యాధి ఉన్నవారికి మలందగ్గర అనేక ఫిస్టులా రంధ్రాలు ఏర్పడతాయి. ఫిస్టులా రంధ్రాలు 1-2 కి మించి అధికంగా ఉన్నప్పుడు అవి క్షయవ్యాధివల్ల కావచ్చునని తగిన వైద్యపరీక్షలు చేయాలి.

కేన్సరు ;-

మలం ప్రేగులో కేన్సరు ఉన్నప్పుడుకూడా ఫిస్టులా ఏర్పడవచ్చు.

# 20. ఫిస్టులాకి చికిత్స

మందులవల్ల ఫిస్టులా నయం అవదు. యాంటిబయాటిక్ మందులు వాడడంవల్ల తాత్కాలికంగా చీము తగ్గవచ్చు. నొప్పి లేకుండా పోవచ్చు. కాని ఫిస్టులా పూర్తిగా నయం అవడానికి ఆపరేషను ఒక్కటే మార్గం.

ఫిస్టులా ఉన్న వ్యక్తికి మత్తు యిచ్చి ఫిస్టులాట్రాక్‌ని పూర్తిగా తీసివేయాలి.

కుళ్ళిపోయిన కండని పూర్తిగా తీసివేయాలి.

ఫిస్టులా ఆపరేషను వల్ల మలద్వారం ప్రక్కన పెద్ద గుంటగా కనబడుతుంది. కాని ఆరోగ్యకరమైన కండ తయారవడంతో ఆ గుంట అంతా పూడిపోతుంది.

ఫిస్టులా ఆపరేషను అయిన తరువాత సక్రమంగా మానడానికి రోజూ డ్రెస్సింగ్ చేయాలి.

ఫిస్టులా విషయంలో ఫిస్టులాట్రాక్‌నీ, దాని చుట్టూ ఉన్న చెడు కండనీ పూర్తిగా తొలగించకపోతే తిరిగి వస్తుంది. ఆపరేషను చేసిన తరువాత ఎవరికయినా తిరిగి వచ్చిందంటే ఆపరేషను పూర్తిగా జరగకపోవడమో, డ్రెస్సింగ్ సక్రమంగా చేయకపోవడమో కావచ్చు.

# 21. ఫిస్టులాకి దారితీసే పుండు

మలద్వారం ప్రక్కనే యానోరెక్టల్ యాబ్సెస్ వస్తుంది. ఈ పుండు చాలామందిలో యాబ్సెస్ రావడానికి బాక్టీరియా క్రిములు చేరి చీముగడ్డ తయారవడమే కారణం.

## చీముగడ్డకి కారణం

మలద్వారం ప్రక్కనే ఉండే యానల్ గ్లాండుకి ఇన్ఫెక్షను రావడం, మలద్వారం ప్రక్కన ఏదయినా గ్రుచ్చుకోవడం, చర్మంలో ఏర్పడిన చీము పొక్కు లోపలవేపుకి పెరగడం, రక్తంలో చేరిన వ్యాధి క్రిములు అక్కడ స్థావరం ఏర్పర్చుకోవడం. యానోరెక్టల్ యాబ్సెస్ రావడానికి ముఖ్య కారణాలు.

## కనబడనిగడ్డ కుదిపేసే నొప్పి

మలద్వారం ప్రక్కనే ఏర్పడే చీముగడ్డ కొందరికి పైకే వుంటుంది. ఇటువంటివారికి మలద్వారం అంచునే చిన్న ఉంతలాగా తయారవుతుంది. కొందరు దీనిని క్రొత్తగా వచ్చిన మొలలు అనుకుంటారు. అది చాలా నొప్పి అనిపిస్తుంది కూడా. చాలామందికి పుండు పగిలి చీము కారి

పోతుంది. మరికొందరికి చీముగడ్డ చాలా లోపల వుంటుంది. ఎంతో నొప్పి చేస్తుంది. పైగా ఒకచోట ప్రారంభమయిన పుండు ప్రక్కలకికూడా వ్యాపిస్తుంది.

## చీముగడ్డకి శస్త్రచికిత్సే శరణ్యం

చీము గడ్డ ఎక్కడ తయారైనప్పటికి వీలైనంత త్వరగా శస్త్రచికిత్స చేసి చీముని, కుళ్ళిన కండని పూర్తిగా తీసివేయాలి. పుండు పూర్తిగా మానేవరకు డ్రెస్సింగు చేయాలి.

మలద్వారం దగ్గర పుండు పడినప్పుడు చీముని తీయక పోతే రక్తంలోకి చీము క్రిములు చేరి దుష్ఫలితాలు కలిగే ప్రమాదం ఉంది.

చీముగడ్డకి శస్త్రచికిత్స చేయడం, తగిన యాంటిబయాటిక్ మందులు వాడటం సరైన పద్ధతి.

# 22. మలద్వారంలో పాలిప్స్

మలద్వారంలో మొలలు ఉండటమే కాకుండా పాలిప్స్ అనే మాంసపు కండలు ఉంటాయి. చెట్టుకొమ్మకి పండు వ్రేలాడినట్లే పాలిప్స్ మలం పేగులోపల పేగుకి వ్రేలాడుతూ ఉంటాయి. మొలలు తరచూ రక్తం కారినట్లే వీటినుంచి కూడా రక్తం కారుతుంది.

ప్రోక్టోస్కోప్, సిగ్మాయిడ్ స్కోప్ పరీక్షలతో పాలిప్స్ స్పష్టంగా కనబడతాయి. వీటిని ఆపరేషను చేసి తొలగించాలి.

# 23. మలద్వారంలో గడ్డలు

మలద్వారంలోగాని, మలం ప్రేగులోగాని కేన్సరు గడ్డలు, కేన్సరు కాని గడ్డలు తయారవుతాయి. ఈ గడ్డలు చిన్న పిల్లల్లో, పెద్దవాళ్ళలోకూడా వస్తాయి.

ఎడినోమా :-

ఎడినోమా గడ్డ ఏ వయస్సు వారికైనా వస్తుంది. ఈ గడ్డ ఒక్కటే కావచ్చు, అనేకం కావచ్చు. ప్రాక్టోస్కోప్, సిగ్మాయిడ్‌స్కోప్ పరీక్షలద్వారా గుర్తించి శస్త్రచికిత్స ద్వారా తేలికగా తొలగించవచ్చు.

పాపిల్లోమా :-

ఇటువంటి గడ్డలు మధ్యవయస్సులో వస్తుంది. పాపిల్లోమా చెట్టు పొదలాగా అనేక తలతో ఉంటుంది. పాపిల్లోమా మొదట్లో మామూలు గడ్డ, కాని తరువాత కేన్సరుగా మారుతుంది. అందుకని మొదటి దశలోనే దీనిని తొలగించాలి.

ఫైబ్రోమా :-

ఫైబ్రస్‌పాలిప్ రావడం మామూలే. ఇది కేవలం కేన్సరు కాదు. సాధారణంగా మొలలు గట్టిపడి ఫైబ్రోమాగా మారుతాయి.

**హిమాంజియోమా :-**

మలం పేగులో రక్తంగడ్డ తయారవుతుంది. హిమాంజియో ఉన్న వారిలో మలద్వారంనుంచి రక్తం కారుతుంది.

పై పరిస్థితులు ఉన్న చాలామంది వాటిని మొలలు అనుకుని నిర్లక్ష్యం చేస్తారు. అందుకని తగిన పరీక్షలు జరిపించుకోవడం అవసరం.

# 24. మలం ప్రేగుకి కేన్సరు

మలంప్రేగుకి (రెక్టమ్‌కి) కేన్సరు రావటం ఎక్కువ. స్త్రీలలో ఈ కేన్సరు ఎక్కువ. స్త్రీలకి వచ్చే కొద్దిపాటి కేన్సరు వ్యాధుల్లో ఇదికూడా ఒక ప్రధాన కేన్సరు.

మలంప్రేగులో ప్రారంభమైన ఈ కేన్సరు అతిత్వరగా మొలకలుగా బయటకు వస్తుంది. మలద్వారందగ్గర బొడిపిలుగా కనబడుతుంది.

మలంప్రేగుకి కేన్సరు వచ్చిన తర్వాత రక్తంద్వారా, లింఫాటిక్ నాళాలద్వారా ప్రక్కనే వున్న టిస్సులలోకి త్వరితంగా వ్యాపిస్తుంది.

మలం ప్రేగుకి కేన్సరు 40 సంవత్సరాలు దాటిన వారిలో కనబడుతుంది. 60–70 సంవత్సరాల వారికి రావటం ఎక్కువ.

ఈ కేన్సరు మొదటిదశ తెలియకుండా ఉంటుంది. వ్యాధి మొదలయిన సంవత్సరానికిగాని వ్యాధి ఉన్నట్లు తెలియదు. మలద్వారానికి కేన్సరు వచ్చినవారికి మొదట్లో అప్పుడప్పుడు

రక్తం పడుతుంది. అలా రక్తం పడటం మొలలవల్ల అని నిర్లక్ష్యంచేసే అవకాశం వుంది.

మలంప్రేగుకి కేన్సరు ఉన్నవారికి కొంతకాలం మలబద్ధకం, కొంతకాలం విరోచనాలు అవుతాయి. మల విసర్జనలో మలంతో పాటు మ్యూకస్, రక్తం పడుతుంది.

కేన్సరు మొదటిదశలో నొప్పి ఉండదు. కొంతకాలానికి ప్రేగు మెలిపెడుతున్నట్లు నొప్పి వస్తుంది.

## మలంప్రేగు కేన్సరుని తెలుసుకోవడమెలా ?

మలం ప్రేగులోకి ప్రేలుపోనిచ్చి పరీక్ష చేస్తే గడ్డలు గడ్డలుగా తగులుతుంది. ప్రోక్టోస్కోప్, సిగ్మాయిడ్ స్కోప్ ద్వారా కేన్సరు కంతుని చూడవచ్చు. బయాప్సీతీసి కేన్సరుని నిర్ధారించవచ్చు. బేరియం ఎనిమాద్వారా కూడా కేన్సరుని తెలుసుకోవచ్చు.

మలంప్రేగుకి కేన్సరు వచ్చినప్పుడు గజ్జల్లో లింఫ్‌గ్లాండ్లు వాచుతాయి. లివరుకూడా పెరుగుతుంది. లివరు గడ్డలుగా తయారవుతుంది.

## శస్త్రచికిత్స

మలం ప్రేగుకి కేన్సరు వచ్చినప్పుడు శస్త్రచికిత్స చేసి కేన్సరు వచ్చిన ప్రేగుని తొలగిస్తారు.

# 25. మలద్వారం దగ్గర కేన్సర్

మలద్వారం దగ్గర కూడా కేన్సరు కంతలు తయారవు తాయి. నాటు డాక్టర్లు వీటిని గుర్తించకుండా మొండి మొలలు అని చికిత్స చేస్తూ వ్యాధిని ముదరపెడతారు.

1. స్క్వామస్ సెల్ కార్సినోమా:- ఇటువంటి కేన్సరు మల ద్వారం చుట్టు ప్రక్కల చర్మంలో వస్తుంది.

2. బేసల్ సెల్ కార్సినోమా:- ఇటువంటి కేన్సరు మల ద్వారం అంచుల్లో వస్తుంది.

3. మెలనోమా:- ఇది నేరేడు పండు ఆకారంలో బొడిపిగా ఉంటుంది. దీనిని రక్తం మొలగా భ్రమచెందే అవకాశం ఉంది. దీనిని మొదట దశలోనే తొలగించపోతే ఇతర చోట్లకి వ్యాపించే ప్రమాదం ఉంది.

మలద్వారం దగ్గర కేన్సరు వచ్చినప్పుడు శస్త్ర చికిత్స చేసి తొలగించడం, రేడియేషను చికిత్స చేయడం ఉంటుంది.

## 26 మలద్వారం దగ్గర దురద

మలద్వారం దురద అనేక కారణాలవల్ల వస్తుంది.

1. మల విసర్జన ప్రాంతంలో తగినంత శుభ్రత పాటించక పోవటం, అక్కడ చెమట ఎక్కువ పట్టటం, గాలి ఆడని దుస్తులు ధరించటం దురద అనిపించడానికి ఒక కారణం.

2. యానల్ పిషరు పిస్టులా, యానల్ ప్రొలాప్స్, బయట మొలలు ఉండటం మరొక కారణం.

3. లిక్విడ్ పారాఫిన్ ఎక్కువ తాగినా మలద్వారం దగ్గర తడి, దురద ఉంటుంది.

4. ట్రైకోమొనాస్ ఇన్‌ఫెక్షను యోనిలో ఉంటే దానివల్ల మలద్వారం దగ్గర కూడా తడి, దురద ఉంటాయి.

5. నులి పురుగు ఉన్నవారికి కూడా దురద ఉంటుంది.

6. ఎలర్జీ మరొక కారణం.

7. మలం ఆమ్ల గుణం ఎక్కువ కలిగి ఉంటే కూడా మల ద్వారం దగ్గర దురద ఉంటుంది.

8. ఏకారణం లేకుండా కేవలం మానసికంగా దురద అని బాధపడేవాళ్ళు ఉంటారు.

## చి కి త్స

మలద్వారం దగ్గర దురద ఉంటే మూల కారణాన్ని తొలగించాలి. దానికి తగిన చికిత్స చేయాలి.

గాలి ఆడే నూలు దుస్తులు ధరించాలి. నైసిల్ పౌడరు రెండు పూటలా రాసుకోవాలి.

దురద ఎక్కువ ఉన్నవారు కార్టిజోన్ ఆయింట్‌మెంటు రాయాలి.

ఒళ్ళు ఉన్నవారు ఒళ్ళు తగ్గడం అవసరం.

# 27. అర్థం చేసుకుంటే అవస్థలు ఉండవు

మలద్వారం కనబడని స్థలం కనుక చాలా వరకు దానిని నిర్లక్ష్యం చేయడం ఉంటుంది. అదీకాక మొలలు అతి సాధారణమైనది కనుక దాని గురించి అంతగా పట్టించుకోవడం ఉండదు. అయితే అక్కడ మొలలే కాకుండా మరి కొన్ని రావడానికి ఆస్కారం ఉందని గుర్తించి ముందుగానే మేల్కొంటే ఎటువంటి అనర్థాలూ కలగకుండా చేసుకోవచ్చు. అయితే దానికి కావలసిందల్లా విషయ జ్ఞానం.

ఆరోగ్యం పట్ల ఉన్నప్పుడు ఏది ఏదైనదీ అర్థం చేసుకోవడం ఉంటుంది. అనవసరంగా భయపడటం ఉండదు. మూర్ఖంగా నిర్లక్ష్య వైఖరి అవలంభించడం ఉండదు.

అవగాహన, అవలోకన ఆరోగ్యానికి ఆనందకర సోపానాలు సుఖ జీవితానికి వెలుగుబాటలు.

— ... —

"ఇంటింటా వైద్య విజ్ఞానం" ధ్యేయంగా
ఉద్యమిస్తున్న ఏకైక వైద్య విజ్ఞాన రచయిత

డా॥ జి. సమరం

రచనావళి

## 1. ఆధునిక వైద్యవిజ్ఞాన గ్రంథావళి

శరీరంలోని ముఖ్య అవయవాల నిర్మాణం వాటి పనితీరులను గూర్చిన సమగ్ర సమాచారంతో ఒక్కో ముఖ్య అవయవం తనంత తానుగా మన ముందుకు వచ్చి తమ అంతర్నిర్మాణం, ప్రాముఖ్యతల గురించి విపులంగా వివరించడం ఈ గ్రంథావళి ముఖ్యోద్దేశం. ఏ అవయవం అయినా సరిగా పనిచేయలేకపోతే వచ్చే వ్యాధులు- ప్రమాదపు అంచుల్లోకి వెళ్ళకుండా తీసుకోవలసిన జాగ్రత్తలు. నివారణోపాయం గురించి విడమరచి చెప్పే మార్గదర్శి ఈ గ్రంథావళి.

| | | |
|---|---|---|
| 1. | జీర్ణకోశం - వ్యాధులు | రు. 15.00 |
| 2. | గుండె - జబ్బులు | రు. 15.00 |
| 3. | కాలేయం - వ్యాధులు | రు. 15.00 |
| 4. | మూత్రపిండాలు - వ్యాధులు | రు. 15.00 |
| 5. | కీళ్ళ నొప్పులు | రు. 15.00 |
| 6. | మెదడు - వ్యాధులు | రు. 15.00 |
| 7. | ఊపిరితిత్తులు - వ్యాధులు | రు. 15.00 |
| 8. | చెవి, ముక్కు - వ్యాధులు | రు. 15.00 |
| 9. | నోటి జబ్బులు | రు. 15.00 |
| 10. | చర్మ వ్యాధులు | రు. 15.00 |
| 11. | కంటి జబ్బులు | రు. 15.00 |
| 12. | మెడ - గొంతు వ్యాధులు | రు. 15.00 |

## 2. ఆధునిక ఆరోగ్య రక్షణ గ్రంథావళి

అనారోగ్యం అతి సహజం. దానికి కారణం రకరకాల వ్యాధులు. కొన్ని తెలిసి అశ్రద్ధ చేసేవి. కొన్ని తెలియక ముదరబెట్టుకొనేవి. వీటిల్లో మళ్లీ దీర్ఘకాలిక వ్యాధులూ – స్వల్పకాలిక వ్యాధులూ!

ఏ వ్యాధి లక్షణం ఏమిటో – తీసుకోవల్సిన జాగ్రత్తలేమిటో – ఎలా నయం చేసుకోవచ్చో విపులంగా సామాన్యులకు సైతం అర్థమయ్యేలా మీ ఆరోగ్య రక్షణ కొరకు ప్రత్యేకంగా రూపొందించినదే ఈ గ్రంథావళి.

| | | |
|---|---|---|
| 1. | రక్తపోటు | రు. 12.00 |
| 2. | ఉబ్బసం | రు. 12.00 |
| 3. | హార్ట్ ఎటాక్ | రు. 12.00 |
| 4. | మధుమేహం | రు. 12.00 |
| 5. | జ్వరాలు | రు. 12.00 |
| 6. | పక్షవాతం | రు. 12.00 |
| 7. | ఎయిడ్స్ | రు. 12.00 |
| 8. | కేన్సర్ | రు. 12.00 |
| 9. | పైల్స్-ఫిస్టులా-ఫిషర్ | రు. 12.00 |
| 10. | నడుం నొప్పి – మెడ నొప్పి | రు. 12.00 |
| 11. | కడుపు నొప్పి | రు. 12.00 |
| 12. | కామెర్లు | రు. 12.00 |

# 3. శాస్త్రీయ వైద్య విజ్ఞాన గ్రంథావళి

మనిషి వైజ్ఞానికంగా ముందుకు నడుస్తున్నా యింకా వెనక్కి నడిచే ఆలోచనలతో, శాస్త్రీయ దృక్పథం లోపించి సతమతమవుతున్న వారికి ఈ సైన్స్–సెన్స్ సీరిస్ చీకటి తెరల్లో చిగిర్చిన ఓ విజ్ఞాన దీపం. అపోహల అలల తాకిడితో అల్లాడుతున్న మానవాళికి డాక్టర్ సమరం సృష్టించిన మరో వైద్య విజ్ఞాన ప్రపంచం ఈ సైన్స్–సెన్స్.

| | | |
|---|---|---|
| 1. | మనస్తత్వము – సైన్స్ | రు. 25.00 |
| 2. | పిల్లలు – ఆరోగ్యం | రు. 25.00 |
| 3. | పోస్ట్ మార్టమ్ సైన్స్ (అంటుపట్టని వ్యాధులు) | రు. 20.00 |
| 4. | అపోహలు – అనర్థాలు | రు. 15.00 |
| 5. | జబ్బులు – జాగ్రత్తలు | రు. 15.00 |
| 6. | ఆహారం – అలవాట్లు | రు. 15.00 |
| 7. | వ్యాధులు – పత్యాలు | రు. 15.00 |
| 8. | నాటు వైద్యం – నష్టాలు | రు. 15.00 |
| 9. | ముప్పు తెచ్చే మూఢనమ్మకాలు | రు. 15.00 |
| 10. | వ్యాధులు – భయాలు | రు. 15.00 |
| 11. | దంతసంరక్షణ డా॥కె.యల్.వి.ప్రసాద్ | రు. 15.00 |
| 12. | చెవి, ముక్కు, గొంతు వ్యాధులు-బాధలు డా॥టి.వి. కృష్ణారావు | రు. 10.00 |

## 4. సంపూర్ణ సెక్స్ విజ్ఞాన గ్రంథావళి

సెక్స్ అంటే సైన్స్-సెక్స్ అంటే శృంగారం. సెక్స్ లేనిదే లైఫ్ లేదు - క్రియేషన్ అంతకన్నా లేదు. వయసుతోపాటు ఎదిగే సెక్స్ కోర్కెలను స్వయం ఖైదు చేసుకుని తప్పటడుగులు వేసే యువతపై, మూఢాచారపు నీడల ఊడలు పట్టుకు వేలాడే పెద్దలపై సంధించిన విజ్ఞాన బాణమే ఈ సెక్స్-సైన్స్. మార్పు చేర్పులతో సరికొత్త ఎడిషన్లు మీ ముందుకు వచ్చాయి. చదవండి! చదివించండి!!

| | | |
|---|---|---|
| 1. | సెక్స్ - సైన్స్ (మొదటి భాగం) | రు. 25.00 |
| 2. | సెక్స్ - సైన్స్ (రెండవ భాగం) | రు. 25.00 |
| 3. | సెక్స్ - సైన్స్ (మూడవ భాగం) | రు. 25.00 |
| 4. | సెక్స్ - సైన్స్ (నాలుగవ భాగం) | రు. 25.00 |
| 5. | సెక్స్ - సైన్స్ (ఐదవ భాగం) | రు. 25.00 |
| 6. | కుటుంబ నియంత్రణ - పద్ధతులు | రు. 25.00 |
| 7. | గర్భధారణ - సుఖప్రసవం | రు. 25.00 |
| 8. | నిత్య జీవితంలో జెనిటిక్స్ | రు. 20.00 |

## వైద్య విజ్ఞాన నవలావళి

జీవితంలో సెక్స్ సంబంధమైన
అపోహలకూ, ఆవేదనలకూ, అనర్థాలకూ, ఆక్రోశాలకూ
మానసిక సంఘర్షణలకూ పరిష్కారమే లేదా?
"ఉంది" - అంటున్నారు
వేలాది సెక్స్ సందేహాలకు జవాబులిచ్చిన

### పి డా॥ సమరం

తనదైన ప్రత్యేకబాణీలో
చేపట్టిన సరికొత్త నవలా ప్రయోగమే
ఈ సోషియోసెక్స్ ఎడ్యుకేటివ్ నవలావళి
అశేషపాఠకుల ఆదరాభిమానాల్ని
విశేషగా చూరగొన్న ఈ నవలలు
కాని చదువుకోవల్సినవే గానీ -
దాచుకొని చాటుగా చదువుకోవల్సినవి కావు

| | | |
|---|---|---|
| 1. | X క్లినిక్ - మొదటి భాగం | రు. 25-00 |
| 2. | X క్లినిక్ - రెండవ భాగం | రు. 25-00 |
| 3. | సైకో - మొదటి భాగం | రు. 30-00 |
| 4. | సైకో - రెండవ భాగం | రు. 30-00 |

త్వరలో
అంటీ ఐ లవ్ యూ!

# హెల్త్ కార్డు

పేరు :

స్త్రీ / పురుషుడు :

వయస్సు :

చిరునామా :

ఫోను నెంబరు :

ఎత్తు, బరువు :

బ్లడ్ గ్రూపు :

బి.పి. :

మధుమేహం ఉందా? :

మధుమేహం రోగి అయితే ఇన్సులిన్ మరియు సుగర్ తగ్గడానికి వాడే మందుల మోతాదు :

మూర్ఛవ్యాధి ఉందా? :

పక్షవాతం, గుండెపోటు, మూత్రపిండాల వ్యాధి, ఉబ్బసం, ఇతర వ్యాధులు ఉన్నాయా!

సరిపడని మందులు ఏవేవి?

## ఆధునిక వైద్య విజ్ఞాన గ్రంథావళి 'ఆవిష్కరణ మహోత్సవ' సభలో ప్రముఖుల ప్రశంసలు

✧ రాష్ట్ర విద్యాశాఖామాత్యులు డాక్టర్ పి.వి. రంగారావుగారు మాట్లాడుతూ ఇలా అన్నారు –

"వైద్యశాస్త్రానికి చెందిన గ్రంథాలన్నీ ఆంగ్లభాషలోనే వున్నాయి. ఈ కారణంగా ఆ గ్రంథాలకు సంబంధించిన విజ్ఞానం వైద్యులకే పరిమితమైంది. శాస్త్ర గ్రంథాలు మాతృభాషలో ప్రచురితమవడం వల్ల ఆయా శాస్త్రాల పట్ల ప్రజలకు అవగాహన ఏర్పడుతుంది. వ్యాధులు రాకుండా వారు తగు జాగ్రత్తలు తీసుకోవడానికీ, రోగనివారణ పద్ధతులను తెలుసుకోవడానికీ వీలవుతుంది. డాక్టర్ సమరంగారి ఈ కృషి ఎంతో అభినందనీయం."

✧ వైద్య ఆరోగ్య విశ్వవిద్యాలయ వైస్‌ఛాన్సలర్ ప్రొఫెసర్ లింగం సూర్యనారాయణగారు మాట్లాడుతూ –

"ప్రజారోగ్యం పూర్తిగా వైద్యులపైనే కాకుండా ప్రజలపై కూడా ఆధారపడి వుంది. వైద్యగ్రంథాలను ప్రజలకు అర్థమయ్యేలా తెలుగుభాషలోకి అనువదించేందుకు తెలుగు విశ్వవిద్యాలయం, తెలుగు అకాడమీ కృషి చేయాలి. ఈ విషయంలో ముందుగా ముందుకు వచ్చి 'ఆధునిక వైద్య విజ్ఞాన గ్రంథావళి'ని ప్రచురించిన నవభారత్ వారు ప్రశంసార్హులు".

✧ తెలుగులో ఒక ఉద్యమంగా వెలువడిన ఈ గ్రంథావళిని ఆవిష్కరిస్తూ – ప్రజలకు యివి ఎంతో ఉపకరిస్తాయనీ, ఈ సందర్భంగా రచయిత, ప్రచురణ కర్తల కృషిని అభినందిస్తూ కృష్ణాజిల్లా కలెక్టర్ శ్రీ రాజీవ్‌శర్మ, కమీషనర్ ఆఫ్ పోలీస్ శ్రీ ఆర్.పి.సింగ్, సిద్ధార్థ మెడికల్ కాలేజీ వైస్ ప్రిన్సిపాల్ డా॥ యన్.యస్.దాస్ ప్రసంగించారు.

# పత్రికల సమీక్షలు

✧ ఈ పుస్తకాలన్నింటిలోనూ విషయం వైద్యవిజ్ఞానానికి సంబంధించినదైనప్పటికీ, చక్కగా, సులువుగా అందరికీ అర్థమయ్యేలా వివరించారు డా॥ సమరం ... విషయం మంచి అవగాహన కలిగించే రీతిలో వివరించిన రచయిత ప్రచురించిన 'నవభారత్' అభినందనీయులు.

—ఆంధ్రజ్యోతి, దినపత్రిక 19-11-91.

✧ ఇంటింటికీ వైద్యవిజ్ఞానం అందించేందుకు పూనుకున్న 'నవభారత్' 'ఆధునిక వైద్యవిజ్ఞాన గ్రంథావళి' పేరిట ప్రచురించిన ఈ పుస్తకాలు ఇంటింటికీ కాకపోయినా, గ్రామగ్రామానికీ చేరగలిగితే అక్కడికి అనుభవజ్ఞుడైన వైద్యుడు చేరినట్లే !

—ఉదయం, దినపత్రిక 4-12-91





## నవభారత్ బుక్ హౌస్

కార్ల్‌మార్క్స్ రోడ్, విజయవాడ - 2